బెనుమావికొమ్మకుఁ బెద్దతడవులేని
కోయిలపల్కుల కొమరుగలిగె
నింతకెన్నఁడు నిలుకడ నెఱుఁగనట్టి
గాలికిమ్మయి నెమ్మది చాలఁగలిగెఁ
జెప్పనొప్పని యామనియొప్పిదంబు
చిలువయొకిమీఁసకైనను నలువకైన. 5

సీ. పొంకమగుచుఁజను పూవుగుత్తులనొప్పి
కోయిలపల్కుల కొమరుమిగిలి
ముగ్దలుగులెక్కుడు మొగలిరేకులమించి
చెలువంపుఁబాపటఁ జెన్నుమీఱి
వింతవింతలతీఁగె దొంతులసొగసూని
పలుమల్లెమొగ్గల చెలువుదాల్చి
బొట్టుగలకడింది పొలుపున నలరారి
మోవిచిగురుల బల్ కేవిఁ బడసి
యామువేసఁగు నడకల నల్లదనరి
కన్నులకుఁ బండువొనరించెఁగాన లచ్చి
యెల్లవారికి సంతస మెదలలోన
వెల్లిగొలిపి యయ్యామని నెల్లతఱిని. 6

గీ. పురుషులేకుండ నక్కానవువ్వబోఁడి
యలరు కొమరుఁగనిన వల్కులాలకించి
యీడులేకుండ నత్తఱినెల్లపులుఁగు
గములుఁబిల్లలఁ బెట్టంగఁగడఁగెఁ గడఁక. 7

చ. కొలఁకులనాడుచుం బొగడగున్నల డాఁగురుమూఁతలాడుచుం
దొలఁగక చల్లులాడి పువ్వుదుమ్మెగఁ జిమ్ముచుఁ దీవెతూఁగుటు

బాగరుసఁ జిల్కతేజిమళ్ళుపుల్ దమికింపుచుఁ దేఁటులార్వఁగా
జగములమీఁదికిన్వెడలెఁ జక్కెరవిల్తుఁడు మచ్చరంబునన్. 12

వ. అట్టియామనియందు. 13

ఉ. పన్నుగనన్ను మిన్న చెలువమ్మటు వీనులవిందుగాఁగ ము
స్సన్నదివిన్నవించి చిలుకల్దగమిన్నునఁ జన్నవాఁడియున్
గన్నియరూపు కన్నుఁగవఁ గట్టినయట్టుగ బిట్టుతోఁపఁగాఁ
గన్నులవింటిదంట తనకై వడి చూపెను క్రీఁడిపై వశిన్. 14

సీ. కనఁడెట్టయెదుర నిల్చినవారలనునైనఁ
గనియెనేనియు నఱగంటఁజూచుఁ
జెవిఁజొనుపఁ డొరులుచెప్పెడుమాటలఁ
జొనిపెనేనియు నేమిటనుచునడుగుఁ
బలుకరించఁడు తనచెలికాండ్రనైనను
బలుకరించిన వెడపలుకుపలుకుఁ
బిలిపించుకొనునుదాఁ బలుమాఱుఁదిండికి
నెంతసేపటికిని నేగకుండు
మిన్నుమన్నునుగానక మెలఁతమీఁది
కూర్మిఁ బలువింత వలవంతఁ గుందుచుండె
నతనుసిరియెత్తుకొన్నచో మిడిసిపడెడు
ములుచమాసిసిఁబోలి యప్పుడమిఱేఁడు. 15

సీ. గట్టువిల్కాని నెక్కటి నోరిచినగండు
చెఱకువిల్తునిమీఁదఁ జెల్లదయ్యె
మింటిమీనును గూలమీటినయుదుటొంతి
కనుమీలమీఁదను గదియదయ్యె
వింటిజారలనెల్ల వెఱపించులావన్ను
బొమవిండ్లపైఁజూపఁ బోసఁగదయ్యె

జగములెల్లను గాల్చు పొగరుగ్మనిపిఱుందు
దీవులమీఁదను దివురదయ్యోఁ
జాల్రి ద్రోవది పెండ్లిముందల్ల మీఁను
నొక్కయేటునఁ జడసేసియున్న నాఁటి
మగతనం బేమియు నిచట మఱచి మీఁను
నెదుట సాగింపలేఁడయ్యో నిపుడు క్రీడి. 16

క. చాలమును చిల్క చెప్పఁగ
నాలించిన చెలిపిఱుందు నందవుఁజూపున్
నేలకుఁ గోలకుఁ దెచ్చెను
వాలాయము జేవి మేనుఁ బలుడెందంబున్. 17

సీ. ఎన్నితీసినఁ గ్రమ్మఱ నెప్పటట్ల
యూరుచుండెను జల్ తూపులున్నవాని
రెండుమూఁడమ్ములున్న మరుండె గెలిచె
నహహా నలువచేయువుల నేమనఁగవచ్చు. 18

ఉ. ఆమనిఁ గోయిలల్ చిలుక లామని సేయఁగఁ దాళ లేక లోఁ
దామరకంటి నెన్నుచును దామరలింపఁగరాని కోర్కితో
వేమఱుఁ బుంటవిల్లుగాని వేమఱుఁ జేయఁగ నొచ్చికుందు నా
లేమను జూడ కిప్పుడెటు లేమనువాఁడ నటంచు నిచ్చలున్. 19

గీ. ఏకంతబున నన బోఁడి నెదను దలఁప
నేకతంబున ననవిల్తుఁ డేయకుండు
నలరువింటను నన దూపుల్లఁ దొడిగి
యలరువింటను నడయాడు నరద మెక్కి. 20

వ. ఇట్లు చెఱకువిలుకాఁడు పఱపు కలకుటంపఱ నెఱకులు దూఱ నోరువలేక యాకవ్వడి పవంతుక తనకన్నులం గట్టినట్టులయినఁ దనలోఁ దానిట్లని పలవింపదొడంగె. 21

చ. కలికిరొ యిప్పుడేమి యలుకాయలుకా పలుకాడవిట్లు న
న్నలమటఁబెట్ట నాయమగునా తగునా తెగునాయిఁకింతటన్
వలపిది యేలుకొమ్మ మగువా తగువా పగవానియట్ల నన్
దలఁపఁగ జాలిచూపవలదా వలదావలఁదాళనేర్తువే. 22

ఉ. నాయనుఁగున్నెలంది తగునాయను నీవెతసైఁ చువాఁడ నే
నాయను మీఁదఁ దాళఁగలనాయను నన్నిటులేఁచనాయమా
నాయనుఁ గూర్మిఁదప్ప నగునాయనుఁ జక్కనిగుజ్జుమావి గు
న్నాయనుఁ గిన్కఁజూప నదనాయను నేఁబగవాఁడనాయనున్. 23

వ. అనిమఱియుం దనలోన. 24

ఉ. దానిమెఱుంగు జెక్కులును దాని చవుల్లులకించు మోవియున్
దాని నిగారపుందొడలు దానికనుంగవ దానిగుబ్బలున్
దాని యొయారపున్నడలు దాని చొకారపుమేని చెల్వముల్
దాని మొగంబునందమును దాని వయాళ్లనఁగాంచు టెన్నఁడో. 25

వ. అని యిట్లు. 26

గీ. పుడమిఁయంతయుఁ గలిగియుఁ బాడవుమలల
వంటి పసిఁడిగుట్టలుగల్గి పడఁతిపిఱుఁదు
దీవులను జన్నువాన్ను బిందియలఁగోరు
ననయమాతఁడు దొరలకుఁ దనివిగలదె. 27

సీ. నెలఁతుకమోవి ఫ్రేనియలానఁగాఁగోర
నేచవియును నాల్కకెక్కదయ్యెఁ
బడఁతుకమైతావి పసరెుఱుంగఁగఁగోర
ముక్కునకేతావి సొక్కదయ్యెఁ
జిలుకలకొల్కి నవ్వులుకులువినఁగోర
వీనులకేపాట వెలయదయ్యెఁ

గ్రాల్గంటి నెఱసోయగముఁ జూపఁగాఁ గొఱ
నొంపెడికన్నులకొప్పుదయ్యెఁ
జిలిరుబోఁడి నెమ్మోవి మెత్తనముఁ గొఱ
నొదవిగిని బడదయ్యెఁ వేఁడ్కాఁటినోఁక
కేమిచెప్పుదుఁ గవ్వడియింతినొక్క
వానిఁ దక్కంగ మఱి యున్నవానిమఱచె. ౨౮

గీ. ఇట్లు నెలఁతమీఁది యెడఁద్రిప్పుకొనలేక
యలరుఁదోఁట కేగనన్ని యచటఁ
జక్కఁబడునటంచుఁ జనియెఁ బూఁదోఁటకుఁ
జెలులుగొందఱవలఁ జేరిరాఁగ. ౨౯

సీ. బలుమల్లెమొగ్గలు పలుచాలుదలఁపించుఁ
దుమ్మెదల్ కురులచెల్వమ్ముఁ జూపుఁ
జిగురుటాకులు కేలిచెలువంబు వెలయించు
సేనుఁగుల్నెన్నడ నెన్నఁజేయు
దొండపండులు మోవి నిండుచెల్వముఁ జెప్పు
సంపంగిననముక్కు పెంపునుడువు
నరఁటిచెట్లు తొడలయందమ్ముఁ గాన్పించు
జిలుకలుపలుకుల చెలువుఁ దెలుపుఁ
జానరూపును మఱవంగఁ గావకేగఁ
దెఱవరూపుఁ దక్కఁగ నన్ని మఱచిపోయెఁ
దప్పునే తానొక తెఱంగుఁ దలఁచుకొనఁగ
దయ్యె నొండొక తెఱఁగుఁ దాఁదలఁచుననుట. ౩౦

ఉ. కమ్మని తెమ్మెఁ దెమ్మెరలు గ్రమ్మఁగఁ గమ్మనివింటిదంట పూ
వమ్ములు చిమ్మ జిమ్ముమని యామునఁ దుమ్మెదదిమ్ము ద్రిమ్మరన్

గొమ్మలనెమ్ములిమ్ములను గూయఁగఁ జెమ్మట గ్రమ్మితమ్ము లో
క్కుమ్మడి దొమ్మిసేయ దొర యుమ్మలికం బువుఁదోఁటఁగ్రుమ్మఱున్.

సీ. అదెకొమ్మకాఁబోలునసిడాయుఁగాకున్నఁ
జెట్టుకొమ్మయటంచుఁజెప్పఁదివురుఁ
గలికి కప్రంపుఁ బల్కులనిచేరుఁ గనక
ముద్దుగంబూరంపుముక్కలనును
మోవిచివురటంచుఁ బోవునుగాకున్న
మోవిచెట్టులయాకు మొలకలనును
విరిగుఁబ్బలవెయుంచు నరుగునుగాకున్నఁ
బాగుత్తులంచును బోసఁగఁబల్కుఁ
గానలోపల నెల్లెడఁ గానిపించు
నలరుఁదీవెలఁ గోయిలపలుకుగములఁ
బొన్నకాయల మంకెనపూలఁజూచి
చెలిమికాండ్రకుఁ దనగుట్టు తెలియకుండ. 32

వ. అప్పుడొక్క చెలికాఁడు విశారదుండనువాఁ డదియెల్ల నల్లన నల్లంబునం దెల్లంబుగాఁ దెలిసి మెల్లనఁ దనప్రోడతనంబు వెల్లడిగాఁ గవ్వడి యొడలు నెవ్వడిందడవి యాతనితోడ జాడగా నిట్లనియె. 33

ఉ. దేవరమేనికాఁక చలిదేఱెడు తావులఁగుల్కు కొమ్మలం
దావలి మేలికొమ్మఁగని యారసి యావిరిగుబ్బగుత్తులన్
బ్రోవగుకప్రపుంబలుకు ముత్తములుం బలుమల్లెమొగ్గలున్
మోవిచొకాటపుం జిగురుఁబూనికఁగూర్చినఁ గాకమానునే. 34

గీ. ఇపుడు కాఁకదీఱ నెందైననారసి
గొబ్బునను గడంగి కూర్మిచిలుక

వెఱయు పంచదార పలుకులు సికబ్బఁ
జేయవలయు నేమి చెప్పుమయ్య. 35

వ. అనినం గూరిమిచెలికాని నేరుపు మాటలచేత నాతండు చిలుకకుం
దనకు నడచిన నుడువులచందంబును దన డెందం బొక్కచక్కెర
బొమ్మపయిం దగిలి మక్కువం జిక్కియున్న తెఱంగును నెఱింగించి
తలపోసి తెంపుచేసి యింక నెయ్యునికడం దన యుల్లంబులోని
కోరిక చెప్పక కప్పిపుచ్చుట కర్జంబుకాదని యెంచి వెంటవచ్చినవారి
నెల్లర నాయూపనులు చెప్పి సాగనంపి మంతనంబున సంగడికానితో
రాచిలుకలు వచ్చినది మొదలుకొని నేఁటిదనుకం జరిగినదంతయుం
బూసగ్రుచ్చినట్లుగాఁ దెలిపి యిట్లనియె. ౩౬

ఉ. ఇట్టుగనుండె నా తెలివియెల్ల నిఁకేమని తిట్టుకొందు నాఁ
డట్టులు ప్రేముడిం జిలుక యాచెలిసుద్దులె తెల్పు నోఁ జెవిం
బెట్టక యూరకుంటి నిటుమించినదానికి నె త్రప్పుకొంచు నేఁ
డిట్టులు కమ్మవిల్తు విరితూపులు నాటఁగనుంటి నక్కటా! 37

ఉ. గుట్టునఁ జేడె వీడదుగఁ గోరిక లీరికలెత్తి నోరికిం
దొట్టినయంతఁ బంతమున దోసపుసిగ్గొక టడ్డువచ్చినన్
గట్టిగ నోరునొక్కఁ దమిగన్పడనీయక కట్టిపెట్టి యా
పట్టున రాచనీటు గనుపట్టఁగ వట్టిమెఱుంగు వెట్టితిన్. ౩౮

ఉ. ఏనపుడంతయున్వినియు నిట్టటుపల్కక యూరకుంట యే
మో నగుఁబాటుగాఁ దలఁచి ముందఱ నెద్దియుఁ బల్కఁగొంకి నా
యానతిఁ బొంది చిల్కచని యవ్వల నెల్లిదమైతినంచయో
తానెదఁ జిన్నవోయెనొకదా యింక దానికి నేమిసేయుదున్. 39

క. అనిమిగుల వగలఁ బొగిలెడు
ననుఁ గుం జెలికానిలోని యలజడి వోవన్

జనువున మాటలు చెప్పాచుఁ
గొనిచనియె విశారదుండు కొండొకయెడకున్. 40

క. అటునెయ్యునిఁగొని చనుచుఁ
దటుకునఁ జెలికాండ్రకెల్ల దగుపను లెలమిన్
దిటవుగనుజెప్పి వారల
నటునిటువడిఁ బంపివేసి యాక్షణ దోఁపన్. 41

వ. ఇంతంతనరాని సంగడికాని వలవంతం దలంచి తల పంకించి మరుని
మీఁదఁగినుక వొడమి. 42

గీ. మూఁడు కన్నులవానితో మొనసిమున్ను
చచ్చిబ్రతికియు వలతేఁడ చలముతోడ
వేయికన్నుల దేవర బిడ్డమీఁది
కేమొగంబునవచ్చితివిపుడుమరల. 43

గీ. అనుచు మరుదూఱిముందుచేయుంగ వలయు
కర్జమెదలోనఁ దలపోసి కాంచియొకటి
మదికి సరిపడ్డపిమ్మటఁ బొదలు వేడ్క
సరగఁ గ్రీడికిట్లనియె విశారదుండు. 44

సీ. క్రుచ్చులచేనల్ల పుడమివేలుపునిన్న
నావునుగోల్పోయి యారటమునఁ
దనయావు విడిపింపుమనుచు నీయొద్దకుఁ
బరువెత్తుకొనివచ్చి పలుఁదెఱఁగుల
వేఁడిన నాతనివిన్నపంబాలించి
కనికరంబున మదికరఁగఁగఁబాఱి
విల్లుదెచ్చుటకును వెడలి పరాకున
నన్నద్రోవదితోడనున్నతతిని

బడకయిలుసీవు పడిఁ జొరఁ బాలుకతన
మున్ను మీలోన మీరు చేకొన్నయట్టి
కట్టుఁబాటున నొక్కయేఁడట్లనీవు
పుడమివలగొని తిరుగంగఁ బూనవలెఁ. 45

క. ఈపండ్రెండు నెలలు నే
నోపిక నీతోఁడఁదిరిగి యొక్కటవిను మే
నాపడఁతుక యూరారసి
యేపగిదినైన నీకు నింతినిఁగూర్తున్. 46

గీ. ప్రతినకడచను నందాఁకఁ బదిగనీవు
తమకపడకుండ నెట్లైనఁ దాళుకొమ్ము
పిదప నీకోర్కి పండింతు మదినినమ్ము
మనుచు నోడఁబడఁగాఁజెప్పి యతనిఁగొనుచు. 47

గీ. చనియె రాచనగరికి విశారదుండు
క్రీడి పయనంపు వేడుక క్రేళ్ళుదాఁట
నెప్పు డెపుడంచు నిముసంబె యేఁడుగాఁగ
నుండెఁ జిత్రాంగదయుఁ దనయూరియందు. 48

ఉ. ద్రోవదిపెండ్లియప్పు డొకతూవున మచ్చెపు జంత్రమేసె నం
చావలవీరువారు నటనాడికొనం జెవులార విన్న దాఁ
గావున నాఁటనుండి మదికవ్వడియందునె నిల్పియుంట సం
దై విరివింటిదంట యలరమ్ములు చిమ్మెను గొమ్మకొమ్మనన్. 49

గీ. ఇంతితెఱఁగంటి దొరపట్టి నెదను నిలుపఁ
దనకుఁ దెఱగంటితనమబ్బెననఁగ నపుడు
విడిచెనిద్దుర తిండియు నుడిగిపోయెఁ
బ్రొద్దులెంతయుఁ బడఁతికిఁ బొడవులయ్యె. 50

క. నిమర లేకుంటఁ జెమ్మట నిండుటయును
వెసను వేల్పుఁదనమును మానిసితనంబు
నెపుడు నెమ్మనఁ గాన్పింప నల్లతఱిని
గాంచె నరమోడ్పు క్రాల్గంటి కన్నుదోయి. 51

సీ. పువ్వులుముడువదు పూబోఁడియయ్యవి
తోవవిందునల్లని తూవులనిరొ
యద్దంబుఁజూడదుముద్దియ దానఁ గ
న్పడుమోము మున్నిటిపాపయనిరొ
కరలుచేముట్టదు విరిబోఁడియయ్యవి
క్రొవ్వారుతుమ్మెదగుంపులనిరొ
చెలులపల్కులు వినదెలనాగయవియెల్లఁ
జిల్కమొత్తంబుల పల్కులనిరొ
యంతకంతకు వలవంతవింతదోఁప
మరుఁడు పూములుకులడరించి కరము నేఁప
నెడఁదఁ గవ్వడిపయిఁగోర్కి యేపుచూప
సన్నగాలియు నెమ్మని చెన్నుచూప. 52

చ. చెలులను మాటికింగదుమఁ జిల్కలఁ బల్మఱు పీసడించు నం
చలఁదఱుముౕ నెమళ్ళనొగిసారెకుఁ బాఱఁగఁదోలు గండుఁగో
యిలపలుకుల్ వినందలకు నేఁచికలంచును గోరువంకలౕ
గలికి మదింగడింది వెతగల్గిన రోఁతలుగావె యన్నియున్. 53

గీ. బోటినెమ్మను బంగారకోటనపుడు
కమ్మవిల్కానిచిచ్చునఁ గరఁగుచున్న
దోయవంగ మైఁజెమ్మట యొప్పువీఁటి
వెల్లువగుచును బాఱెను బెల్లుదనరి. 54

సీ. ఆవెల్లత త్రడి యత్తఁబోడ తేర్పక
వెలనువెంట్రుకఁ గట్లఁ బులక నగునె
యల్లమానిసిసింగ మక్కుఁ జేర్పక
యుంచుపిల్లుని బెదరింపనగునె
యాపజవరచక్క సామోముదార్పక
కొసమరాయంచలోఁ గొనఁగనగునె
యల్లజగముచుట్టు మలరించి పోలక
తుమ్మెదపిమ్మపైఁ గ్రమ్మనగునె
యనుచు నయ్యింతి సగమును నంతికంత
కొసనిలిచినచోట నిలువకుండఁ దెల్ల
దనముప్రాను వెన్నెలకును దలముడుంపఁ
బలిరుపిల్కాని కాఁకకుఁ దాళలేక. 55

గీ. చిగురుబోఁడికిఁ గోయిలల్ పగవియయ్యెఁ
గొమ్మ కెంతయుఁ దెమ్మెరకూళయయ్యె
నలరుఁబోఁడికిఁ గట్టనివయ్యెఁ దేఁట్లుఁ
దమ్మికంటికి రేజేఁడు దాయయయ్యె. 56

చ. మరునకుఁ దూపు నేనరయ మామవునీవును గానటంచో
నిరువురకిట్టి వట్టిపగయేటికిఁ బాటియె యంచుఁ దెల్పి చం
దురునుదిదేర్ప నాతని నెదుర్కొనఁ దామరచేరెనోయనన్
దరియెఁగఁ జేర్చెఁ జామ చెయిదామరచెక్కున వెచ్చనూర్పుచున్. 57

ఉ. కన్నులకాటుకంగలిసి కల్కిచనుంగవమీఁద జిందు వా
ల్గన్నుల నీటితుంపరల గారవమెన్నఁగనయ్యె నయ్యెడన్
జెన్నెసలారు తామరల చెల్వపుఁదేనియలాని యంతటన్
గ్రొన్ననగుత్తులంగదియు కోరిక నేగెడు తేఁటులోయనన్. 58

ఉ. పుత్తడిచాయ మోమునకు ముక్కున కత్తికిఁ జెక్కుదోయికిన్
బొత్తుగ వెల్లదమ్మినువుఁబువ్వును జందము నిగ్గుటద్దమున్
గుత్తగఁ బోల్చి కబ్బముల కూర్పరులాడినమాట చెల్లెనా
నిత్తఱిఁ జానమేను తెలుపెక్కెను బువ్వులుకాని కాఁకలన్ 59

ఉ. అప్పుడు ముద్దురాలివిభమారసి సందియమొంది నెచ్చెలుల్
మొప్పొదవంగఁ జేరఁజని మేకొనియించుక పట్టిచూచి కే
ల్మిప్పులమీఁదఁ బెట్టినటు నెట్టనఁ దోఁచిన నుల్కుచెంది యా
రొప్పులకుప్పతోడఁ జెలులొక్కట నిట్లనిరుమ్మలంబునన్. 60

సీ. వీనుదోయికిఁ జాల విందుసేయుచు వీణె
మెల్లన కొనగోట మీటవేమి
ముద్దుఁబల్కుల నింపుపుట్టంగ నెప్పుడుఁ
బెంపుడుఁజిల్కలఁ బిలువవేమి
యఱచేతఁ జప్పటల్ చఱచి హెచ్చరికతో
నింటి నెమ్మిళ్ళ నాడింపవేమి
చవితిచందురు దూఱు చక్కని నుదుటిపైఁ
దేటకస్తురిబొట్టు దీర్పవేమి
కలికిరాయంచబోదల గారవించి
తీరుగా నెన్నడల్ తగదిద్దవేమి
మేలిమిపసిండి క్రొంజాయ మిఱుఁజాలు
మేన నాడెంపుఁ దొడవులుపూనవేమి. 61

గీ. మగువ నీ తెఱఁగేమియో మాకుఁజూడ
వింతగాఁదోఁచుచును గడు వెఱపు గొలుపు
చున్నదిదె వేఁడుకొనెదము నిన్ను మేము
చెచ్చెరను నీదు మదివంత చెప్పవమ్మ. 62

గీ. ఎంతవేఁడిన మదివంత నిగురుబోఁడి
సిగ్గుపెంపునఁ జప్పనఁ జెప్పలేక
యుల్లమల్లాడఁ దలవంచి యూరకున్న
మఱియు నిల్లని రప్పుడా మగువలెల్ల. ౬౩

గీ. ఎట్టికట్టును మాతోడనిట్టిదనుచుఁ
దెలిచి చెప్పకుండిన నేము పెద్దయొట్టు
వెంచు బాసఁజేసియు నిప్పుడకట మఱుఁగు
వెట్టఁదలఁచుట మిక్కిలి వింతయవ్వ. 64

క. మనలో నిట్టివిగలవా
యని మఱిమఱి మొదలువిఱువ ననుఁగుం జెలిత్రో
మనమునకొన్నది యిచటని
కనికరమొనయంగ మఱువఁగావలెననుచున్. ౬౫

గీ. అల్లద్రోవది పెండ్లియప్పుడు క్రీడి
చేసిన కడిందిపనులును వానిగన్న
యతనిచెలువంబుఁ జెవులార నాలకించు
కతనఁ దనడెంద మొక్కట నతనిమీఁద. ౬౬

క. తగులు పెఱిఁగించి యప్పటి
దగు తన తెఱఁగెల్లఁ దెలిపి యనుఁగుం జెలియుం
దగ మణిరేఖం గనుఁగొని
తగులుపడంగను నెలుంగు దానిట్లనియెన్. 67

చ. కలుగునొ లేదొ కన్నవకుఁ గన్నులవిల్తుని నేలఁజాలు నే
ల్పులదొరపట్టి చక్కఁదనముంగని పొంగెడునట్టి ఫేలు లోఁ
దలఁపఁగ నావనెన్నగులఁ దక్కువనోములు నోచినట్టి క
న్నులకది పైపయిం గలుగునే యడియాసలుగాక కళ్యాణీ. 68

క. ఎక్కడిచే నెక్కడి జే
డక్కన ననుగారవించు నతఁడనుకొనియుం
జెక్కడ యీావలపుఁగడలి
నెక్కటి నేనీఁదుజెడ యీావేసటతోన్. 69

ఉ. ఎవ్వరిఁబంపుదానఁ జనియిప్పుడు చెల్వునితోడ నావెతల్
నెవ్వడివిన్నవించి తననేరుపుచూసి మదింగరంచఁగా
నివ్వలవంత నెక్కరణి నీఁగుదునక్కట చిల్కలై ననుం
దవ్వులకేగ కియ్యెడను దాపుననుండిన నన్నుఁగాదుఁగా. 70

క. అనుచుండఁ దలఁపులోనన
చనుదెంచెను జిలుకకవయుఁ జదలుననటకున్
విని తెక్కచప్పుడొక్కట
ననుఁగుం జెలులెల్ల తెప్పలార్పకచూడన్. 71

గీ. చేరవచ్చి చిత్రాంగద చేతిమీఁద
వాలి ముద్దిడి సేమంబువరుసనడిగి
పలుకు వెలఁదుక తమ్మియ్యఁబంచినట్టి
యీాగిత్రమూఁకుల క్రొవ్విరులెలమినిచ్చి. 72

చ. నలువ జగంబునందలి వినందగువింతలు కొన్ని తెల్పి యీా
వలఁ దమ కూర్మినెచ్చెలిని బాలుఁగనుంగొని యీామెమేను మి
క్కిలి వసివాడియుండుటయుఁ గీడ్వడిమోమునఁ దొంటితెల్వి యి
మ్ములఁ దిలకింపరామియును మున్గల సంతసపాటులేమియున్. 73

క. కనిపెట్టి డెందమందున
వనటం దిగులొంది శోడివారలనెలమిన్
వనబోఁడి యట్లు చిక్కట
కును గతమడుగంగ వారు కూరిమిమీరాజన్ 74

ఉ. మున్నులమించి మీను నొకముక్కని కాంచి క్రీడి గ్రోవడిన్
గొన్న చెలంగు జవ్వనులకుం గను వాసలు గొల్పు రూపునుం
గన్నదివేయునోళ్ళ ముకుకల్గొని యాడఁగ నాలకించి యా
యన్నులమిన్న పొంగి యెదపూతకుఁపై నెలకొల్పె నవ్వగన్. 75

క. కందుచు నెవ్వరిత్రోఁదన
డెందంబున కోర్కి వెల్లడింపక లోలో
నందురి యంతంతకు నెయి
యందము చెడ సన్నగిల్లి యలసగమైనన్. 76

ఉ. తత్తఱమొందిదీనికిఁ గతం బెఱిఁగింపఁగదమ్మ యంచు మే
మిత్తఱి వేయిచందముల నీమెను వేఁడిన నెట్టకేలకున్
బిత్తరి యంతయుం దెలిపి జెలతనంబునఁ బల్కులాడి తా
ను త్తలపాటుతోడ ముఖము నొక్కటఁ జేర్కొని యూరలుండెనన్. 77

క. తనకిమ్మోడఁ గడుఁదోడయి
పనిపూనికడిందికోర్కి పండింత్రుగదా
యని వేచియున్నదిదె మ
న్ననమీ చెలి నప్పగించినారము మీకున్. 78

ఉ. మా బరువంతయుం దొలఁగె మా చెలియన్నియుఁ గూర్చినార మిం
కీబలితంపుఁ గర్జమెటు లీరలు దీర్చెదరో సుకీ యనన్
జాబిలి చల్వచూపులను జామును గన్గొని మంజువాణి గా
రాబము మీఱ నిట్లనెఁ గరమ్మును దేనియలొల్కు పల్కులన్. 79

సీ. మేమిద్దఱము మున్ను మీయొద్ద సెలవొంది
నలువజగమ్మున కలరు వేడ్క
మింటను జనుచుండి మిట్టులు పల్లముల్
చదును నేలలయట్లు మదికిఁదోఁపఁ

గుప్పముల్ పల్లెలుఁ గుప్పవోసినయట్లు
కనుపింపఁగాఁగను గానఁబడఁగ
జెఱువులుమడువులు, జిన్న యద్దపుబిళ్ళ
లట్లుచూడ్కికిఁ జాలనందగింప
వేడ్కఁబడుచును నెడనెడ వింతలెల్ల
నంటొరులతోడఁ జెప్పుకొం చొక్కచోట
నూరిపజ్జగప సింగార మొలుకుచున్న
పూవుఁదోఁటలో నొక్క క్రొమ్మావిక్రింద. 80

సీ. బవరిగడ్డమువాని బవడంబుఁ గ్రొత్త చెం
దొవపంబుఁ దెగడు కేల్దోయివాని
తలిరుఁబాయమువాని వలతేనినిండుక
ల్వలతేని నగియెడు చెలువువాని
తళుకుఁజెక్కులవాని తమ్ములమీలమొ
త్తమ్ములనగు కన్నుదంటవాని
తేనెమాటలవాని తేఁటులఁగవ్వుజా
తేటలనగుసిగతీరువాని
చెలులతోడను ముచ్చటలాలుపువాని
కవ్వడినిజూచి యాపోయగంబునకును
నచ్చెరువుఁనొందుచును గ్రిందికల్లడిగ్గి
కంటిమాతనిఁ గన్నులకఱవుతీఱ. 81

సీ. దారలేనిదారమోవి దొండపండెన్న నే
చిలుకలకొల్కిలోఁ దలఁపకుండు
పుడమియేలికమేని బుజము తూడులఁజెప్ప
వేయంచయాన కన్నిడకయుండు

నలకేశిమోము వెన్నెలకేశిఁ గానియా న
నేకల్వకంటి లోనెంచకుండు
నోడయనిపొక్కిలి మడువు చెక్కున్న నే
జక్కవచంటిలో స్రుక్కకుండు
నట్టిజెగజెట్టిఁ జేపట్టునట్టిమేలు
పొదలు నిమ్ముద్దరాలికి నొదవెనేని
బదిలముగఁ బదియార్వన్నె పసిఁడితోడ
మంచి కెంపునుగూర్చిన మాడ్కి యనుచు. ౮౨

క. తలపోసి యతనిఁ గన్గొని
వెలయన్నముఁ జెప్పికొంచు వెలఁదుకనచ్చోఁ
బలుకుల వెంబడిఁ జేర్కొని
చెలువెల్లను బాగడి మున్ను చెప్పినదానన్. ౮౩

క. చెప్పినదంతయు నూఁకొని
యప్పట్టున నాతఁడిట్టునట్టును ననకా
చొప్పు మఱపించి నేరుపు
చొప్పడ వేఱొక్కకతకుఁ జొన్పను వన్నన్. ౮౪

ఉ. అంతియచాలునంచుఁ దఱుచాడక యత్తఱినూరకుండి నా
యంతనుబోయితిం బయనమై సెలవాయనరొద్దఁబొంది వి
న్పొంతల నల్వపీటికిని ముద్దియ నీమది గొంతిపట్టిపై
నింతగనిల్చియుంట రొఖక యింతయు నప్పుడు నేనెఱుంగమిన్. ౮౫

క. అనిమఱియు నేమొచెప్పఁగఁ
జనుచిలుకం జెప్పనీక సడలినతాల్మిన్
గనుఁగొనల నీరు కాఱఁగ
ననియెం జిత్రాంగద గడు నడలుపొంగన్. ౮౬

క. అక్కటికపించుకయు లే
కక్కటికిలిసంబుఁ బూన నగునా యుల్లం
బక్కట క్రీడికి నదియును
నిక్కము నేఁ జేసికొన్న నెఱదోసమొకా. 87

చ. పసితనమేగి జవ్వనము వచ్చినయంతటినుండి నెమ్మదిన్
విసువక కోరుచెల్వుఁ డొకఁ వేనను నొల్లకయుంట యిద్దియున్
బనదఱుగంగ వీనులవినంబడియుం దెగలేక మేనిలో
నుసురులు దాల్చెదన్వ్రతలకోరిచి యెంతటిదోసకారినో. 88

క. వానిం గలయఁగ నగునని
యేనెంతో యాసపొంది యిన్నాళ్లుండం
గా నేఁటికి నిటులాయెను
వానిఁ గలయలేని దొక్క బ్రతుకే తలఁపన్ 89

ఉ. ఆసను ద్రెంపలేక యిటులందని మ్రాఁకుల పండ్లకూరకే
వేసరగొంతుసాఁచినను వీసమువాసియుఁ గూడివచ్చునే
మీసరివారు మెచ్చుకొన మేనుత్రొఱంగెదనమ్మలార నా
యాసలు నేఁటితో విఘవుఁడందఱుఁ గేల్గవమోడ్చి మ్రొక్కెదన్. 90

వ. అనునంత నచ్చిత్రజి చెలికత్తెలు తత్తరపడి యింతంతనరాని యుత్త
లంబున రంతులుసేయుచుఁ బలువురు పలుమాటలాడి యాబోటి
న్మ్రొదలింపఁ జొచ్చిన నచ్చెలుకకలికియుఁ దనలోన. 91

ఉ. కై కొనకుండరాదు మనకన్నులముందఱ నేఁడెపుట్టి తే
పేకడతేఱువారి మనమొందఱుఁ జూడము చావనంగ వే
తే కొనితేరఁగావలెనె యేనిఁక నొప్పరికించి లోని యీ
పీఁకనడంపకుండినను వేయెటుపోనెటువచ్చునో కదా. 92

వ. అని తలంచి యామించుబోఁడిం దిలకించి. 93

గీ. ఏల యీలాగు నిండిన యింటిలోనఁ
గుడిచి కూర్చుండి పని లేని గొడవ యొకటి
పైని వేసుక పొగలెదు పడఁతి యిన్ని
చాలుఁబడి వేలు వచ్చె నీ చలము నీకు. 94

గీ. తాను బోయిన పిమ్మట దేనికోడ
నైనఁ బనియేమి తెంపు సేయంగవలదు
తలఁపఁ జనునమ్మ నీయంతదానికిట్టి
వెతఁగుఁ బనులక్కటా యెంత వెఱ్ఱిపైవు. 95

ఉ. చానరో పోలుపొం వెఱఁగఁ జాలక యూరక కుందవేల నె
ద్దీని ననంగఁ గొట్టమున నీవలిగుంజను గట్టుమన్న చే
మైనను జెప్పఁగాఁ దరమె యాతఁడు నాఁడటు పూజ చేసల్కఁ జే
మానినదానికింగతము మన్నన విన్నమి గాక నాకుఁ గల్. 96

గీ. అనుడు నాచిలుకలకొల్కి యవలఁ జిలుక
చెప్పఁ బోయెడు సుద్దిని జివరదనుక
వినెడు వేడ్కఁ యువ్విళ్ళూర వెచ్చనూర్చి
యీవలావలి చెలులతో నిట్టులనియె. 97

గీ. మదికలంకఁ జేసి యిది యనంగాఁదగు
నిదియనఁ దగదనెడి యెఱుక లేక
యేమియోపలికితి నింతేకా తుసురులు
విడువఁ దలఁప నంత వెఱ్ఱినమ్మ. 98

గీ. అకట నవ్వుటాలకూరకే యన్నమాట
నిజముగాఁ బట్టి యిపుడింత నెలఁతలార
పట్టిపల్లార్చి నామీఁద వట్టి లేని
పోని వాదు వేయఁగఁ బాడియానె మీకు. 99

గీ. రవ్వపెట్టక యింకనైన రమణమీఁద
జాలిమొయిఁజిల్క నేఁదియో మేలిపలుకు
చెవిని వేయంగ నుంకించెఁ జెలియలార
వినఁగ నీరమ్ము మొక్కెద వినులలవర. 100

వ. అనుడు నప్పుడప్పడంతులెల్ల జప్పుడు సేయక యొప్పులకుప్పయగు నప్పలుకుచెలువ యొప్పిదంబుగాఁ జెప్పఁబోవు మెప్పుమాటల కొప్పారెడు నుల్లంబు లుప్పొంగ నూరకున్న నాచిలుకకలికి కలికి పలుకుల నాచెలువల చెవులకుఁ జవులుగొలుపుచు గిలుకుమెలుంగున నిట్లని చెప్పందొడంగె. 101

సీ. అలప్రావుఁదోఁటలో బలుకువెంబడిమున్న
పొలఁతినీరూపు నేఁబొగడినపుడు
వలపు మోదములోనఁ గలిగియుఁ గొండంత
యొక్కింతయును వెలికుబ్బనీక
యగ్గలంబుగఁ దొట్టు సిగ్గుకతంబున
దానినంతయు మదిలోనె యడఁచి
కల్లగుట్టొకయింత కాన్పింపఁబైటికి
నౌనుగాదనుమాట యనకయుండె
నువిదరో యంతెకాని వేఱొండుగాదు
వినుము వినుపింతుఁ దరువాత వెఱ్ఱియగుచు
వలపుతలకెక్క నాతఁడు మెలఁగినట్టి
నడత చందమించుక తేటపడఁగ నీకు. 102

ఉ. నిన్నను నల్వపేదుకొని నేనరుదెంచుచుఁ గంటిఁ ద్రోవలోఁ
బెన్నకుఁ జేరువం గనులవిందుగఁ జెన్నగునొక్కకోనయం
దున్నగుడారముం దటిసియొప్పెడు మామిడిగున్నక్రింద నే
గన్నులవేల్పుపట్టి చెలికాఁడొకఁడుం దగఁ గూరుచుండఁగన్. 103

క. కని వారేమనుకొందురొ
వినవలెనని వేడ్కపొడమి వెననాలేమ్రాఁ
కునకుండిగి యొకకొమ్మను
బనివడి నేఁగూరుచుంటి బడలికవాయన్. 104

వ. అయ్యెడ నాకవ్వడి వెడవిలుకానియలజడిం దెలివిచెడి యిదితగు నిదితగదనియెడి యెఱుకలేక యెదుటఁ గనఁబడు వానినెల్లం దడవి యిట్లని పలవింపదొడంగె. 105

సీ. అలలార యంచ తొయ్యలులార మీరైనఁ
జిత్రాంగదకు నన్నుఁ జెప్పఁగలరె
తొగలార మేలిసంపఁగులార మీరైనఁ
జిత్రాంగదకు నన్నుఁ జెప్పఁగలరె
పొదలార గండుతుమ్మెదలార మీరైనఁ
జిత్రాంగదకు నన్నుఁ జెప్పఁగలరె
విరులార చలువతెమ్మెరలార మీరైనఁ
జిత్రాంగదకు నన్నుఁ జెప్పఁగలరె
యెంతవేఁడిన నొకరైన నించుకంత
పలుకరైనను నాతోడఁ బలుకరేమి
నేనుజేసిన తప్పిద మేదియైనఁ
గలదె యెల్లరు నన్నిట్లు చులకసేయ. 106

గీ. నేమమున నేను బండ్రెండు నెలలబట్టి
యిన్నియేళ్ళకుఁజని గ్రుంకులిడినయట్టి
పున్నెమున నైన నాకు నాపువ్వుబోఁడిఁ
గాంచుమేలైన నొకసారి గలుగరాదె. 107

క. అని పెక్కువగలఁదలఁకెడు
ననుఁగుం జెలికాని లోని యలజడితగ్గన్

మనమిడెచని చిత్రాంగదఁ
గనుఁగొందము సుమ్మియెల్లి కన్నులుతనియన్. 108

క. అందాఁక నోర్చుకొమ్మని
కందువమాటలను జెల్మికాఁడొకఁడచ్చో
డెందమునందలి కుందున్
డిందింపుచునుండ నపుడ నేనును గడఁకన్. 109

క. నీయెడ యాతనిపయి నిటు
లోయింతిరొ తగిలియుంట యొక్కింతయు నే
నాయెడ నెఱుఁగమిచే నీ
చాయలవచ్చితిని నంతెచాలు నటంచున్. 110

క. నమ్మమిది నేఁట తేషటఁ
గొమ్మా నిన్వెదకికొంచు గొబ్బున తేఁడి
యిమ్మునకేతెంచి నినున్
నెమ్మిం జేపట్టు నీదునెచ్చెలు లలరన్. 111

సీ. కాన నూఱడియుండుము నేనుబోయి
యిపుడ మీతల్లిదండ్రుల కెలమి మ్రొక్కి
వారిసేమంబు లారసి వత్తుమరల
ననుచుదిగ్గున రాచిల్క లరిగెఁజదల. 112

క. చిలుకలటుచన్న పిమ్మటఁ
జెలికత్తియలంతిపురికిఁ జెచ్చెరఁ జెలువన్
బిలుచుకొనిపోయి రూఱడఁ
బలుఁదెఱఁగుల దిటవుగఁబలికి పాయనికూర్మిన్. 113

వ. అటుతరువాత నడచినకత చెప్పుమని జనమేజయుం డడుగుటయును. 114

మాలినీవృత్తము.

జగము లరయువాఁడా సాధులం బ్రోచువాఁడా
నగధరుఁ జనులఁగాంగా ప్రాపజెత్వన్న దొంగా
నగమెఱుఁగనివేల్పా పైఁడిపుట్టంబువాల్పా
వగలుఁ దొలఁచుమిన్నా వాసిగన్ గొల్లపిన్నా. 115

కందగర్భితమణిగణనికరము.

చిలువపరకశఱపు జెలువునఁ జెలఁగన్
సిలుగుల నడఁచెడు సిరిచెలిమగఁడా
నలువయుఁ గొడుకయి నలువుగ వెలయన్
బలుకుఱఁబగతుర బిగిచెఱుచుదొరా. 116

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన
నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సత్యశోభాబంధుర కందు
కూరివంశపయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య
పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన
రసికజనమనోరంజనంబను ప్రబంధరత్నంబునఁ
ద్వితీయాశ్వాసము.

# రసికజనమనోరంజనము.

## తృతీయాశ్వాసము.

క. సిరియుం బలిమియు సేమముఁ
దిరముగ మదినమ్మికొలుచు దిట్టల కెల్లన్
గరము స్నెవరున నిచ్చుచు
నరయుచు సాదులన్బ్రోచు నలకరివేల్పా. 1

వ. వైశంపాయనుం డటమీఁద నడచినకత జనమేజయున కిట్లని చెప్పం దొడంగె. నట్లు చెలికత్తియలు పొత్తుగ నత్తెఱవం గొనిచని మనికిపట్టుచేర్చినఁ జేర్చిన మరుచిచ్చునకుఁ దాళఁజాలక చాల జాలిం దూలుచు వారల నేమఱించి. 2

సీ. అలమోవి దొండపండనవచ్చు చిల్కల
జవ్వాజివలపులు నసలఁద్రోయ
బుజముతూడులఁజూచిపోరివచ్చునంచలఁ
దుఱుముక్రొమ్మొగిలింతఁదొలఁగఁద్రోల
చనుపూవుబంతులఁ గనివాలుత్రేఁటుల
ముక్కుసంపఁగిమొగ్గ మొనసితఱును
కయికొమ్మల నదల్పఁగావచ్చు తెమ్మెర
నొకట నూగారు పామొదుగఁజేయ
కలికిచూపున గనిచేరు కమ్మవిల్తు
బలఁగముల నాకలికిచూపె పాఱఁజేయ
బోటి వెడలెను బూవులతోఁట కపుడు
చెలుల దిగనాడి యొకఁబాటు చెలువఁగూడి. 3

గీ. అంత నింతులెల్ల నెంతయుఁ దలఁకొంది
యింటఁ జెలినిగాన కెల్లచోట్ల
వెదకి తత్తరించి వెలఁదు లుత్తలమున
నలరుఁదోఁటఁ జేర నరుగుదెంచి. 4

మ. కని కెలదోఁటలో వలపు గ్రమ్మెడు తమ్మికొలంకువంకఁ జ
క్కని సనదేని పేటిచియుఁ గాలువ పావలిమావి క్రేవఁ బ
న్నిన నెలకాలమేలిపసి నిద్దపుముద్దుటరుంగు చెంగటన్
బొనరిన కమ్మచెంగలువ పుప్పొడి తిన్నియ యొద్ద ముద్దియన్. 5

వ. కని యిట్లనిరి. 6

చ. ఎటువలె మమ్ముఁ బాసి యిపుడిచ్చటికింటికి వచ్చితమ్మ నీ
వెటువలెఁ బూవుఁదేటి పెనువెల్లువ లీఁదితివమ్మ నీవు కా
ల్పెటువలె నోర్చినమ్మ వెలఁదీ యిటు పుప్పొడితిన్నె లెక్కఁ గేఁ
డెటువలెఁ దూఁటితమ్మ పొదరిండ్ల నయోతరుణమ్మ యిప్పుడున్. 7

ఉ. నీచెయిదోయి కెంజిగురు నీనునువాతెఱ దొండపండునున్
నీచనుబూవుగుత్తులును నీచెలువారు బుజంపుఁగొమ్ములున్
జూచినఁ గోయిలల్ చిలుకజోటులుఁ దుమ్మెదచాలుఁ దెమ్మెరల్
హా చెలి యించుకైన నిను నాఁడిపెట్టక నిల్వనిచ్చునే. 8

సీ. ఒడలెఱుంగక మరుఁడుండి మండిపడును
గూడి తేఁటులు కాఱుకూఁతలఱచు
వదరుచుఁ జిల్కలు వడిఁ బండ్లుకొఱుకును
పరువెఱుంగక యంచ బారసాఁచు
కదిసికోయిలపిండు కన్నులెఱ్ఱగఁ జేయుఁ
బొగరున గోర్వంక లెగిరిపడును
మెయిజల్లుమనగాలి మీఁదిమీఁదికి వచ్చుఁ
గన్నుగానక నెమ్మిగంతులిడును

గోలతనమున బలుముద్దుగాలవగుట
వచ్చితివిగాక యెురులిట్లు వత్తురమ్మ
యించువిలుకాని దడములకిక్కయైన
కారుకోనకు నొంటిమైఁ గలువకంటి. 9

సీ. సారెసారెకువీచు చలువతెమ్మెరకాదు
తియ్యవిల్తలవాని తేరుగాని
యలచెట్లసలరించు నామనిదొరగాఁడు
పచ్చవిల్తుని దళవాయిగాని
పరువులెత్తెడు గొఱవంకగుంపులుగావు
తలిరాకువిలుకాని దండుకాని
తావి గుబుల్కొను తమ్మిమొగ్గలుగావు
కమ్మవిల్తుని తూపుగములుగాని
తేనెలానివెడలు తేఁటిపాటలుగావు
మొనయుమరుని నారిమ్రోఁతగాని
కెలనవిరియు కన్నెగేదంగి పువుగాదు
పూలవిల్తు చేతివాలుగాని. 10

వ. అని చెప్పునప్పు డప్పడంతుక కంతకంతకు వలవంత వింతయయి చూపట్ట నప్పట్టునఁగల వింతలుచూపి వంత మఱపింతమని యెంచి మించుబోం డ్లమ్ముద్దరాలిం బూలుగోయుదము రమ్మని తోడుకొని చనుచు నిట్లనిరి. 11

చ. చిలుకలకొల్కి కన్గొనుము చెన్నగుతీవియఁ జిల్కకొట్లచే
నలరుచు దొండపండు దనరారెడు డెందమువొంగఁ జెల్వునిం
గలసిన పంటినొక్కులను గందియు ముద్దులుగుల్కుచున్నయు
గ్మలిచెలువంపుఁ గెంబెదవికై వడిఁ గ్రాలుచునున్న దెంతయుఁ 12

తెల్లవాఱతడవ యుంచలెల్ల విడువ
కెంతదవ్వైన వినువాకఁ కేగునమ్మ
యట్టివారలచే నెగ్గుపుట్టుటెల్లు
వలదువలవంత యొక యింత వారివలన. 18

చ. మొగిళులఁ జూచి సంతసముఁబూను నెమళ్ళను సంచపింతు, సం
పఁగిపువుతావులంగొనెడి షయ్యెర తుమ్మెదదిమ్మ తిమ్మెలం
డగిలికలంచుజాబిలియుఁ దామరచాలుఁ పొసంగిమన్కి యో
ముగుదరో! సాగదేరిఁగొని ముంకుమరుండరుజెంచు నీపయిన్. 19

సీ. నీకంటఁబడినేలనిలుచునే మరుడాలు
నిలువుగ్రుడ్లుపడి తానీరుచోరక
నీమాటవిన్నఁ దానిలుచునే మరుతేజి
తోఁకత్రెంచుక కానఁదొలఁగిచనక
నీమోముగన్నఁ దానిలుచునే మరుమావు
దిగఁజక్కిబయలునఁ దిరిగిచెడక
నీచేతఁబడ్డ దానిలుచునేమరుబాకు
వసఁకిమ్రాఁకులనంటిపట్టుకొనక
మిట్టిపాటును నెగరిపాటట్టులంపుఁ
బ్రిమ్మరితనంబుఁ గలకుఁదనమ్ముమాని
మునిఁగి డాఁగి పఱచి కూలి చనియెనేని
యెంతమండిపడిన మరుఁడేమిసేయు. 20

చ. దరిచెడి కానపాల్పడియె దండులు, తూపులువిచ్చిపోయెఁ దే
రరుదుగ మూలఁబట్టెఁ, జెలువారుసిడంబులు నీటిపాల్పడెఁ
విరివిరిపోయె వారియును విన్నిగదాలుపు కంటి మంటలన్
మరుఁడునునీల్గె, గొందలముమానుము పూవిలుకాని డాడికిన్. 21

వ. ఇట్లు నెచ్చెలులెచ్చరించుచుఁ దోడుకొని చనుచు. 22

వృషగతిరగడ.

కలికి కలికి మొగంబులం గనుఁగప్పుఁ గప్పురపుంపుమూఁకము
పలుకుపలుకులుగాఁ జవకెంపిలవఁకలవఁకరగఁ జనసేము
పాదలుపాదలు దాయఁబోక వనబోటిబోటిగమిఁ వెన్కనమువు
మొదలమొదల వెలఁపుదోఁపసిటు మేల మేల కను పెద్దముసువు
కానకానవ నెఁలుబుచెక్కియకు కన్ను కన్నిఁ బఁజేసిచూడకు
మానుమానును గుట్టుచెప్పెఁజ మాటిమాటికి మన్నువిడకు
కొమ్మకొమ్మలపంచులెల్లను గోయఁగోయని కూయుఁజిల్కలు
నెమ్మినెమ్మనిజూడు మల్లదె నీడనీడను దానికిల్కలు
చెలువచెలువగు పువ్వుసిరొగఁ జిలుకఁజిలుకరాలిచెఁ బూలను
వలరు వలరులురాలెఁ గన్గొను మన్నమన్నన సేయువేలను
దసరఁదసరవణములూడ నెఱతావి తావిదిరమ్మనిచెలికి
ననుచు ననుచుచేమంతిపొదకు నల్లనల్లనఁ జనె నొకకలికి
మంచిమంచిసుమంత కప్పిన మావి మావిడిని మున్నెప్పుడు
మించుమించులబోఁడి పొదమె మీఁదమీఁదడయడఁగ నిప్పుడు
తెఱవ తెరువది తిన్నగాఁ జని తేని తేనియవాఁక తాకదు
నెఱయు నెఱయుప్పరిగ వేడుక నించునించుక కాఁకసోఁకదు
పొగడపొగడఁదగి తావులవనబోఁడి పోడిమిమీఱఁగ్రాలెను
పగలుపగలు మొగముతో నెఱపి వాడివాఁడిమి దమ్మితూలెను
నెన్ననెన్నఁడు గొజ్జఁగులపూవింత వింతగ లేదు డాయుము
కన్నకన్న గేదఁగి క్రొన్ననఁ గడఁకఁగడకన్నెత్తికోయుము
కొనక కొనకటులేల చూచెదు గోరగోరఁట పూలుద్రుంపవె
మొనయు మొనయురియూడు సంపెఁగ మొగ్గమొగ్గక కేలనింపవె
యేలయేలకిపొదవిరి మొత్త మెల్లమెల్లన రాల్పఁజాలవు
గోలగోలనుగొంచు నాకలిగొట్టుఁగొట్టుము నేలపాలవు

జాలజాలగు కాల్వదరిఁ జనఁజాగి జాగిటుచేయ నేటికి
నాడ నాడుకోయిల యిపుడేమఱచె మఱచెనీనుడి నేటికి
జానజానగు తావితావెదఁ జల్లజల్లని బావిఁగందమె
పూనిపూనికలెల్ల దీఱఁగ మొల్లమొల్లపుఁ దావిగొందమె
యలసియలసిగ పూలుఱులఁజఱియందయందఱుఁగూరుచుందురె
వెలయవెలయనరాని కొలంకు వేఁడివేడిఁదొలంచుకొందురె. 23

సీ. అడుఁగుల కెంజాయ లలముపట్టులుచూచి
తలిరాకుపడెనంచుఁ దలఁచివంగి
తనచూపుచాలు పర్విన పూలఁదేంట్లని
చాఁచిన కెంగేలు సరగఁదీసి
తగఁబల్వరుస తెల్పు జిగిపర్వఁగెల
మల్లెమొగ్గలటంచు గిల్లబోయి
యొడలిబంగరునిగ్గు లడరుమ్రోఁకులఁజూచి
సంపెంగననలంచు సరసఁజేరి
యొండొరుల నవ్వుకొంచు నయ్యువిదలెల్ల
విరులుకోయంగఁ జొచ్చిరి వింతమీఱఁ
గలికినడకల నంచల గరువమడఁచి
యందియలు కాళ్ళ గళుగళ్లు మనుచుమ్రోయ. 24

గీ. చిగురుటాకులు వడిఁద్రుంచెఁ జెలువయొకతె
యపుడ చేతులకసిదీఱునట్లుగాఁగ
మల్లెమొగ్గల వెసఁద్రుంచె మగువయొకతె
యలుకమెయిఁబంటఁ బగపట్టినట్టుగాఁగ. 25

సీ. వడిఁబొన్నవిరిగోసి యొడిఁబెట్టె నొక్కతె
పొక్కిలితో సరిపోల్చుకరణి

వెసఁ గోసి సంపంగి విరిని మూర్కొనె నొకర్తు
ముక్కుతోడను సరిపోల్చు కరణి
చిగురుజొంపము ద్రుంచి చేతఁ దాల్చె నొకర్తు
పాణిఁ గేలితో సరిపోల్చు కరణి
మొగలిరేకులు గోట ముట్టి గిల్లె నొకర్తు
మొగి గోళ్ళతో సరిపోల్చుకరణి
దొండపండును గోటికె వాతుక యొకర్తు
పొసఁగఁ గెమ్మోవితో సరిపోల్చుకరణి
తీవె మొయినంటఁ జే యెత్తి తిగిచె నొకతె
పూని నెమ్మేనితో సరిపోల్చుకరణి. 26

గీ. వెలఁదులమ్మ్రాఁకిఁ జిగురులు విరులుఁ గోయఁ
దూలి నెవ్వఁగఁ జొంపుచుఁ దోఁటబోటి
యొకటఁ గన్నీరు నించెడు నోయనంగఁ
దొడిమలను నీరుకాఱంగ దోఁగె నపుడు. 27

వ. ఇట్లు పూలుగోసి యలసి సొలసి యమ్మగువ లెల్లం జెమ్మటలఁ దొప్పదోఁగి నెత్తమ్మికొలంకున నీరాడఁ గోరుటయు నచ్చిత్రాంగద.

గీ. మేలిమగరాలపట్టుల మెల్ల నడచి
మెఱుఁగులీనెడు రతనంపు మెట్లు డిగ్గి
వలపుగాలిపెడు తామరకొలనుఁ జేరె
నొక్కనెచ్చెలి కేల్దమ్మి యూఁతగొనుచు. 29

క. క్రొవ్వేదనించుక కనుఁగొని
క్రొవ్వేదనించుకయు విడిచి గుంపుగ నంచల్
దవ్వుల మొయిలని పాఱెను
నవ్వులపాలయు కొలఁకుదఱి నవ్వాలివలనన్. 30

చ. చెలువలు సొమ్ములు న్విలువచీరలు నొడ్డునఁ బెట్టిపావకల్
బలుచనుకట్లుఁగట్టి పరివారలఁజీరుచు నీరుచొచ్చి రా
పొలఁతులకొప్పు ముక్కు మొగముంగని యంచలుఁ దేంట్లుజక్కవల్
జళుకున నల్లమబ్బు జిగిసంపెఁగ చందురుఁడంచుఁ దూలఁగన్. 31

సీ. చిలుకలకొల్కుల చేతులునడుగులు
నెఱ్ఱదామరగుంపు నినుమడింప
ముద్దులగుమ్మల మోములుఁజన్నులుఁ
బొందామరలగుంపుఁ బుట్టఁజేయ
కలువకంటుల వాలుఁగన్నులచెన్నులు
నాలుగన్నగమి నిబ్బడిగఁజేయ
క్రొవ్విరిబోఁడుల కురులమొత్తంబులు
నాఁచుతీవెలపెంపునలువరింప
నెలఁత తెల్లను గుములుగానీరుచేరి
యింపుదళుకొత్తఁ బెల్లుగా నీఁదునపుడు
చెలువుమీఱిన నెత్తమ్మి కొలఁకునకును
గరమువింతగఁ గ్రొత్తసింగారమొదవె. 32

చ. చెలువయొకర్తు కేఁజిగురుఁ జిమ్మనగ్రోవి యమర్చి పూవుఁదే
నెలు చెలిమోముదమ్మిపయి నెమ్మినిజిమ్మనఁ గేలుదామరల్
తళుకుమొగంబుచేరవకుఁ దారుచుటొప్పగుఁ బూవునీటికిం
దలఁకకు మేముగల్గనని తమ్ములుబాసట వచ్చునచ్చునన్. 33

గీ. ఒండొరుల కేలుఁదమ్ముల నొక్క మొగిని
నెమ్మొగంబుల పయినీరుచిమ్మటొప్పెఁ
దమ్మిపూఁదేనియను జూపుఁదుమ్మెదలకు
మించుతమి నోగిరంబుగఁ బంచునట్లు. 34

క. సంకటము పోకఁగ నెఱుకయి
యింకొకయెడఁ జలపుసోక నెలవట్టరయై
పొంకపుఁ గాటుకసోకిన
వంక నలుపయి కొలఁకు వలువన్నెల నమరెన్. 35

సీ. కస్తురికొప్పులనుండి కాఱుచుండెడునీరు
చిఱుతమబ్బుల వానచినుకులట్లు
గబ్బిగుబ్బలనుండి కాఱుచుండెడునీరు
జలితంపుమలల పెన్వాఁకలట్లు
కమ్మమోములనుండి కాఱుచుండెడునీరు
సొగసుచందురు మంచుసోనయట్లు
కలికికన్నులనుండి కాఱుచుండెడునీరు
నెత్తమ్మిపూవుఁ దేనియలయట్లు
వాతెఱలనుండి తగజాలువాఱునీరు
పలుచనగు దొండపండులపాలయట్లు
వింతవింతలఁ దనరెఁ గన్విందు గాఁగ
లేమలటనీటిలో మున్గి లేచునపుడు. 36

గీ. పడఁతిమిన్నలు కొలఁకు వెల్వడెడునప్డు
డొడలనంటిన నీటిబొట్లొప్పుమీఱె
నేవళంబుగఁ బెరుగు క్రొందీవగములు
మొగ్గతొడిగినక్రైవడి ముద్దుగులుక. 37

చ. తనతలచెక్కలంజొనిపి దాపుననొడ్డునవంచ పవ్వళిం
చినఁ గనికట్టుపుట్టమని చేడియయొక్కతె కేలవంట ము
క్కునవది కేల్వడింబొడువ గుబ్బెతగొబ్బున నుల్కిపాటునన్
వెనుకకువచ్చి దానిఁగని నివ్వెఱనవ్వెరి తోడిచేడియల్. 38

గీ. ఇట్లు కోలఁకువెల్వడివచ్చి యింతులెల్లఁ
జమ రవణములు వల్వలుఁదాల్చి పిదపఁ
బువ్వుఁబోఁడిని గై సేసి పూలుదుఱిమి
పొసఁగ మొగమునఁ గస్తురిబొట్టువెట్టి. 39

గీ. మెల్లమెల్లనె యపరంజిమేడపొంతఁ
బూవుఁదోఁటను గుజ్జుక్రొమ్మావి నీడఁ
జెన్నుమీఱెడు నెలఱాలతిన్నెమీఁదఁ
బాలఁతిఁ గూర్చుండఁబెట్టి యాపువ్వుబోండ్లు. 40

క. జాణతనపుమాటల వి
న్నాణముచూపి చెలియమదినాటిన కుందుం
బోనడఁచి ప్రొద్దువోవఁగ
వీణియఁగొనివచి ముందుపెట్టిన వేడ్కన్. 41

గీ. తీగెలుబిగించి సుతి కడుఁదిన్నపఱచి
పూని వీణియను బుజంబుపై నిమోపి
కేలునవరించి సారెల వ్రేలునిలిపి
యెలమిమీఱఁ జిత్రాంగద యింపుపుట్ట. 42

సీ. క్రొవ్వాఁడికొనగోళ్ళ గ్రుచ్చితంతులుమీటు
నందంబు మదిజల్లుమనికలంప
మురిపెంబుగాఁబల్కు ముద్దుటెలుంగున
కల్లనఁగోయిల లరుగుదేర
సారములుకలిపించి సొగసుగాఁబలికించు
వింతకుఱాలెల్ల వెసఁగరంగ
వాయులుగాఁబాడెడు నోఱపై నపాటకుఁ
జేరువమ్రాఁకులుం జిగురుపట్ట

క. ఒప్పుల కుప్పయనంజను
నప్పడఁతికి నామదిఁగల యలజడియెల్లం
జెప్పి కరంచక యేమో
చెప్పితినని నీవసడ్డచేసెదసుమిత్రా. 49

వ. అనిన నవ్విశారదుండు నవ్వి కవ్వడితోడ. 50

గీ. ఎంత దేవర పనియన్న నింతలోనఁ
బూని పండించుకొనివత్తుఁ బోసఁగఁబలికి
యానతియొయన్న నెయ్యంబుగానిపించు
నెలనగవునవ్వి తలయూచి యెగరవైవ. 51

చ. అలయది సన్నగా నెఱిఁగి యాతఁడుసామి హోసాదటంచు రెం
డడుగులు ముందుసాఁగి మొగమల్లన జేనిదెపన్నకల్చి చే
తులువడిమోడ్చి సంతసముదోఁపఁగ నిచ్చట నున్న యట్టిలే
తలఁపును పోయివత్తునని దారినిసాఁగెను వేగవేగఁగన్. 52

సీ. నెలతాల నేల పజ్జలఁగ్రాలుగొజ్జంగి
పువుసీటియేటి వెల్లువలుదాఁటి
కపురంపు టంటికంబపుగుంపునంటిన
తుదిదారిగోరింట పొదలుదాటి
యల్లిబిల్లిగ నల్లు మల్లెతీవెలనల్ల
మెలత్రేఁటిమేటి పాటలకునలరి
సురపొన్నగున్నల దరినున్నతిన్నెల
పయిపోలి మేలిత్రేనియలుగ్రోలి
తావిచెంగల్వబావుల క్రేవనడిచి
కన్నెగేదంగిపొదరిండ్లు గాంచిమెచ్చి
క్రొత్తజవ్వాజివలపులు గుత్తగాంచి
గుజ్జులేమావినీడల పజ్జచరిగి. 53

యని చెలిపిందుత్రోడ మమునవ్వులఁ జూడకమున్నె యిట్లు నీ
వనవిని నంతనుండి మదికచ్చెరువయ్యెడు మూకుఁదోయ్యలీ. 58

క. దవ్వులనాతనిఁ గన్గొని
పువ్వారుంబోఁడి యొక్క పొలఁతిఁబిలిచి యీ
వివ్వచ్చు బాపనికినిడ
నెవ్వడినోక గద్దెఁగొంచు నెచ్చెలిరమ్మా. 59

క. అని తనయునుఁగును గనుఁగొని
గొనబునఁ బనివినఁబనిచినఁ గొనకొనిచని చ
య్యన సిగనిగమునుగద్దియఁ
గొని చనువును నెనరును బెనఁగొన నటనునిచెన్. 60

వ. అప్పుడతండు. 61

గీ. అదిగో 'వివ్వచ్చు బాపఁడంచ' నెడునార
యీమెయెఱిఁగి నన్ననవాలిడియెనేమొ
పల్కినటులు నీవివచ్చుబాపఁడంచు
నువిదమదినెంచి యిట్లని యుండఁబోలు. 62

క. అని సందియంబుదోలఁకఁగఁ
జనియాతఁడు చెంతఁజేరి సరగనడఁకువన్
ననబోఁడి చేయిచూపఁగఁ
గనుసన్నలఁ గూరుచుండె గద్దియమీఁదన్. 63

వ. అంతనప్పుడు. 64

ఉ. త్రోవపుఁబేరులాడ నసదుంగవునల్లలనాడ ముంగురుల్
పారెడువీడఁ గ్రొంజెమట చక్కని చెక్కులమీఁదఁగూడ బం
గారపు గిల్కుటందియులు కమ్మనిపాటలు పాడ నెంతయుం
గూరిమి నేలవేల్పు నడుగంగవకుం జెలి క్రొమ్ముక్కెరఁ గ్రక్కునన్. 65

వ. అనియమ్మగుమ్మం గొండొకవడి చిఱుముడిపాటున నెడఁదం దలపోసి
యతం డప్పడంతుల కిట్లని చెప్పందొడంగె. 72

ఉ. మావొర యొప్పుఁ జెప్పెదరమా మనకవ్వడి యాతఁ డారయం
పైదలి వేడ్కమీఱ విను మానిక ముందలఁదాల్చుదిట్టదా
గాదిలి వేఁటకై యెఱుకకై వడి నిప్పుడు వచ్చెఁగానకే
మావట వెంటవచ్చితిమి యాయనచూడ్కికి విందుసేయుచున్. 73

చ. తపసులనుండి యేము ముదితా యతఁ డెచ్చటి కేగుచుండు వెం
బడిఁబడి వచ్చుటచ్చటికి వాసయు నెంతయు నాకవేడ్కతో
నడుచుచుఁ గొల్చుచున్న కతనం గడునెయ్యముచూపి నిచ్చలా
తఁడె యొసఁగుం జుమీ తనకుఁదానె మదిన్మము మెచ్చి యన్నియున్.74

సీ. చెలియరో విను మేను జెప్పెదనంతయు
మొదల మాదొర యేకపూనికి నెఱపఁ
దనమన్కి వెలువడి తద్దయుఁ గోరిక
నందందుఁ గలవాఁక లరసి యరసి
యలతుమ్మెదలపాట లాలించియాలించి
సొలయక వింతలు చూచిచూచి
చెలువంపుఁ గోనలు తిలకించి తిలకించి
కన్నారఁ గొండలు కాంచికాంచి
నెలలు పండ్రెండు పొలుపుగ నేలఁదిరిగి
తనదుపూనిక నెఱవేర్చి చనఁదలంచి
వెండియుఁ జోట నొకపూఁటయుండ మదిని
దలఁపుపుట్టిన నాఁగి నేఁ డెలమిత్రోడ. 75

సీ. సరిమాలు మావుల దరిఁ గ్రాలు బావుల
విరిచాలు తావుల వేడ్కనొంది

చ్చోటికిముందుగాఁ బనిచెఁ జొప్పగనుంగొని రమ్మటంచు న
మ్మోటియు వచ్చెఁగర్జమిట మేలగుపల్కెఁక వీనుసోఁకినన్. 81

క. ఇచ్చట కొమ్మలచెలువున
కిచ్చను గడుసంతసిల్లి యీకోనకునే
మచ్చుగవచ్చితిమీఁదగు
మచ్చిక నీయలరుఁగొమ్మ మాదొరకనుచున్. 82

వ. అని చేతిలో నొక పూఁగొమ్మ పట్టుకొని. 83

క. ఇక్కొమ్మపైఁ దలంపెద
నెక్కువగాఁ గల్గియుండు నింతిరొకనిసన్
ముక్కంటి యబ్బరంపడు
నిక్కముదాఁచంగనేల నీమానసుమీ. 84

క. అని తెల్పివారి వెండియుఁ
గనుఁగొని యోకన్నెలార గారవమునమీ
ననఁబోడిఁ గన్ననుండియు
నెనరును వేడుకయు వెఱఁగు నెలకొనెమాకున్. 85

ఉ. ఈమురిపెంపుఁ బల్కులును నీనునుఁబాటల యొప్పిదంబు నీ
మోము చొకాటముంగనిన ముద్దియలారవినుండు వేయునిం
కేమిటికీవెలంది మదినెంచఁగఁ దామర చూలి రాణియో
యామె యొనర్చినట్టిజవరాలొ యనంగను మాకుఁదోఁచెడున్. 86

క. తొయ్యలి ప్రోలెయ్యది పే
రెయ్యది యీచెలువఁదాల్ప నెన్నికఁగనెనో
యియ్యెలనాగం గడుపున
నెయ్యేకిమీఁదుగనెనొ యెఱిఁగింపుముమాకున్. 87

వ. అనిన నతని జాణతనంబునకును నేరుపుమాటల పొంకంబునకును
డెందంబున నివ్వెఱపడి. 88

గీ. మేరమొఱఁగి చెప్పి మెప్పింతుననుకొన్న
నెలఁజేనియుసప్పుఁ బాలవెల్లి
పలుకుఁజెలికిమిగులఁ దలమునకలయినచో
నొరులుదాని నరయ నోపువారె. 95

గీ. అట్టియెకిమీనికి ననుంగుఁబట్టియీమె
కనులయెదురనె కాన్పించు కతనవేఁత
యీమెచెలువంబు పొగడంగ నేలమాకుఁ
బలుకువెలఁదుక మెప్పునఁ గలిగెనీమె. 96

ఉ. నడను మీతెరుంగనివి యేవియు లేవటుగాన మీఁదనే
జాడల నెప్పుడెవ్వనిని జవ్వనిసెట్టనఁ జెట్టవట్టునో
వేఁడెద నిక్కవంబు వినిపింపుఁడు కల్లలుపల్కరేని నా
తోడుసుఁడీ యటంచు మదిఁగొట్టెలఁబల్కిన నవ్వి యిట్లనున్. 97

క. మేమరయఁగ మీవారము
కామే మమ్మింత వేఁడఁగా లాఁతులమే
లేమా లెస్సగఁజూచిన
మీమొలఁతుక యొక్కటియును మేమొకటియునే. 98

మ. చెలియా సందియమేలనీపడఁతుకంజేపట్టు విన్వచ్చుఁ డి
మ్ములనామాటలు నమ్మియుండు మిటుపైఁ బూబోఁడియుంగ్రీడి తా
మలరుందావియుఁ బోలెనొక్కటయు రొయ్యారంబుగా నుండఁ గ
న్నులనిండం గనువేడ్కయీచెలులకు న్గొన్నాళ్ళకేకల్గెడున్. 99

క. కన్నుల విల్గలవాఁడిం
కన్నులలో మేలుబంతియగు నీనవలా
కన్నుల తూపులుగావే
గన్నులదొరపట్టి గెలువఁగలవాఁడుసుమీ. 100

దప్పులెన్నక మన్నింపఁదగదె యిట్టి
చేతిపసితీర్పఁ దమకెంత సేవుపట్టు. 107

సీ. పఁజేయువిన్నపం బీడేర్చననుగదా
యేకీడుమాట నాలింపఁదప్పు
నీకఁ గ్రీడిఁ దనపట్టినియ్యా నీకొల్పినఁ
గద మెండు నాగుండెకుదిరియుండు
నామేలిమాట నాయుమచెవివేయఁ గ
ల్గినఁగదా నెమ్మదివనటమానుఁ
బడఁతియాతని చెట్టఁబట్టఁ గాంచఁగనబ్బు
నాఁడుగాపండువు నాకుమిగుల
ననుచు మణిరేఖమఱియు నెయ్యమునఁబలుకఁ
బడఁతి తేనినెప్పుడు చెట్టవట్టునోయను
తమకమునఁ బల్కఁ తినిగాని తమరుపలుకు
మాట ముంగొంగుబంగారు మూటమాకు. 108

గీ. అనిన నన్నెలవేలుపు కనఁలుమూసి
యపుడు లోనిచూపునసేదో యరయునట్లు
మదినిదలపోసి కనువిచ్చి మగువలార
మేముదపసులమయ్యును మీాకుఁగాను. 109

క. తడయక కవ్వడికడకున్
వడిఁబోవఁగ నొప్పుకొన్న వారమవల మా
యొడయఁడును వేచియుండును
బడఁతీపోదుమని సెలవువడయుచునరిగెన్. 110

వ. అంత నక్కడఁ గవ్వడియును. 111

గీ. ఇచటనున్నట్టులేతన్ను నెంచుమనుచుఁ
జెప్పి సంగడికాఁడెంత సేపాయయ్యెఁ

బోయిరాఁ డాయె నిదె చాలఁ బ్రొద్దువోయె
నచటఁబోయిన పనియేమొ యక్కలాలు. 112

గీ. అనుచుఁ దలఁచుచు నవ్వులవసగుపెంచు
నెచ్చెలిమికాని దవ్వుల నెమ్మిఁగాంచి
యెదురుచని చెప్పవంత కోర్వదను లేక
చనినపని కాయెనో పండెనో యనుచు నడుగ. 113

సీ. ఏనుబోయినపని గాయమేలయగును
బనిని పండించుకొనియె నేవచ్చినాఁడ
నిన్ను మున్నట్లు వీడ్కొని నేనుగదలి
తొలుతఁ గారుకోనలు దాఁటి తోఁటఁ జొచ్చి. 114

క. ఎలజవ్వనముం దొలఁకఁగఁ
దొలుకారుమెఱుంగులట్టి సొడవులుగల యా
బలు సింగారంపు నెలం
తలలోపలఁ గూరుచున్న నాతుకఁ గంటిన్. 115

వ. ఆచక్కెరబొమ్మ చక్కదనమ్మొక్కించుక వక్కాణించెదఁ జక్కఁగా
వినుము. 116

సీ. బయలరిక్కలచాలు పాఱవైచినయొగ్గు
మలలనెల్లను జట్టువఱచునేగి
పవడంబులను బ్రమానుపడఁగఁ జేసినకీడు
సింగంబునడవిపాల్సేయురవ్వ
చందురులోఁగందు పొందించునారడి
చిగురులఁగఱకుగాఁ జేయుకొదవ
నెత్తమ్ములను లోఁతునీటవైచినరట్టుఁ
బసిఁడికిఁ దావిఁగూర్పనికొఱంత

కలికినోరులు సిబ్బెంపుగబ్బిగుబ్బ
లలఁతి మోవియు నసమఁగా నలరుమోము
నొనబుచేతులు తెలిగన్ను లొనరుమేను
జేసి నెత్తమ్మిచూలి సొంపుఁజేసికొనియె. 117

గీ. ఈమ కలిగించియును బువ్వుబోఁడికీడు
కలుగకుండఁగ నొనరించె నలువయాత్ర
తలఁచిచూచిన నేదియో తమ్మి చూలి
బక్కగావింపఁగాఁబోలునిక్కముగను. 118

గీ. నలువ తమ్ములఁ గల్వలఁజెలువమిాఱఁ
జేసి యవి రేయుఁబవలును జెన్ను లేని
వాటపాడగాంచి యూరెంటి నేటఁగలిపి
కలికికన్నుల ననయంబు వెలుఁగఁజేసె. 119

గీ. నేలపై నంటులుంట యేమేలివింత
యనుచు మదినెంచి వింతసేయఁగఁదలంచి
నలువ యనఁటులపై నేలకలుగఁజేసె
నెలఁత తొడలును మొలయునఁ నెపమువెట్టి. 120

ఉ. మించులఁ గెంపుల న్నలను మేలియనంటులఁగూర్చి నల్వమై
మించును వాతెఱ న్మొగము మేల్తొడలుం దగఁజేసి వానిలో
నించినతళ్కునిఁ బిగియు నీలియు నాకును దీసిచూపులున్
బించపుఁ గుబ్బలుం దుఱుము వీఫు నొనర్పఁగఁబోలునింతికిన్. 121

చ. అలతలకట్టు లింతితఱు లన్ను కనుల్నిడుదల్వెలంది చె
న్నలరెడు బొడ్డువట్రుసుడి నాతుకనై కపుఁగొనుసున్న బం
తులు ననబోఁడి చన్నుఁగవ దొంతిగవిద్దెలు రూపుపూని యా
వెలఁత నెపంబునం బుడమిమిాఁదను గ్రుమ్మరుచున్నవారయన్.122

చ. అను చెలికానితత్తరము నంతయుఁ గన్గొనితాను జేని పీ
డ్కొని యటుపోవుటల్ మొదలుగుబ్బెతలుండిన పూవుఁదోఁటకుం
జని పలుకాడుటల్తుదిగఁ జక్కఁగనంతయు విన్నవించిరో
య్యన జెలికత్తియల్ పలికినట్టి తెఱంగెఱిఁగించి యిట్లనున్. 129

గీ. నిన్ను వేఁడెద మన్నించి నన్నొకింత
పలుకుచెవిఁబెట్టి యాకన్నెవలన నీవు
మున్నుగన్నకొమారుని వన్నెమీఱ
నెలమి మామకుఁ బెంపుగ నియ్యవలయు. 130

గీ. ఇంతవట్టును జనవిప్పుడిత్తువేని
కొమ్మ తప్పకిప్పుడు నీదుసొమ్మసుమ్మ
నేనుజెప్పితినని వెన్క నేరమిడక
యిపుడ ముందుగఁ జక్కఁగ నెంచుకొమ్మ. 131

ఉ. ఏలతలంప వేపలుకు లించుక దేవరయానతిచ్చినం
జాలును నేలతేని సరసం దగ నేలినవారికర్జమున్
ఏలుగ మాటవెంబడిని విన్నపమానఁజేసి వేల్మిడిన్
మేలొనగూర్చి వత్తునను మెచ్చఁగ నిప్పుడ పోయివచ్చెదన్. 132

వ. అనిన గారవంబున విశారదున కానేల తేఁడిట్లనియె. 133

క. సతమును గోరికలూరఁగ
నతివఁగవయ నెప్పుడెప్పు డనుచుండఁగ నిం
తతడవు జెప్పఁగనేటికి
బతిమాలఁగ నేడు క్రొత్తవాఁడనె నీకున్. 134

చ. పలుకులిఁకేల నీపనుపు పన్నుగఁజేసెద నెన్నఁడైన నీ
పలుకున కడ్డమాడుదునె పట్టినొపంగద తేపెపోయి యా
పొలఁతుక కన్నతండ్రికడ ముచ్చటలాడుము మేలునెంచి నీ
కెలమి నిఁకేమియిచ్చినను నించుకయేనియు నప్పుదీఱునే. 135

గీ. అనుచుఁ గొనియాడి చెలికానిఁ జనువుమీఱ
మగువపలికిన పలుకులు మఱియుమఱియు
నడిగి విన్నవేవించు నెయ్యంబుమిగుల
వేడ్కపడుచుండెఁ గవ్వడి విసుగులేక. 136

వ. అనినఁ దరువాతికత చెప్పుమని జనమేజయుం డడుగుటయు. 137

నిరోష్ఠ్యకందము. రక్కసిఱేండ్లఁగలనన్
జక్కడఁచి యలతెఱగంట్ల సాఁకెడిదిట్టా
చక్కఁగ నెల్లరసేగిం
జిక్కఁగనియ్యక యరసెడిజేజేరాయా. 138

ఉత్సాహ. చుట్టువాలు కేలఁబూని చూడువిన్నఁ జంపి చే
పట్టువాఁడఁ గ్రీడినంచుఁ బన్నిత్తేరుడిగ్గి వే
పట్టుపట్టి విన్నువాఁకపట్టిమీఁది కేగుచోఁ
జట్టిక్రీడి వెన్కకీడ్వ బాగుమీఱువేలుపా. 139

గద్యము.

ఇది శ్రీమదాపస్తంబసూత్ర లోహితసగోత్ర శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన
నైషధమహాకావ్య రచనాచాతురీధురంధర సద్యశోబంధుర కందుకూరి
వంశ పయఃపారావార రాకాకైరవమిత్ర సుబ్రహ్మణ్యామాత్య
పుత్ర సుజనవిధేయ వీరేశలింగ నామధేయప్రణీతంబయిన
రసిక జనమనోరంజనం బను ప్రబంధరత్నము
నందుఁ దృతీయాశ్వాసము.

---

# రసికజనమనోరంజనము

## చతుర్థాశ్వాసము

క. సిరిపడఁతి యెడఁదనెప్పుడుఁ
గరమలరఁగ గొల్చువారిఁ గడుఁగూరిమితోఁ
నరయుచు నెల్ల జగమ్ముల
వెరవారఁగ బ్రోచుచుండు వేల్పులవేల్పా. 1

వ. వైశంపాయనుం డటమీఁద నడచినకత జనమేజయున కిట్లని చెప్పం దొడంగె నట్లా బూటకంపు నేలవేలుపు నూటిగామాటలాడి యా చేడియలన్వీడ్కొని క్రీడికడకు న్వేడుకమెయిం జనిన వెనుక నన్నెచ్చెకంటి తమకంబు హెచ్చిపెచ్చుపెరిగెడి మరుచిచ్చున వ్రేఁగంబొచ్చిన నెచ్చెలులెల్ల బెల్లుగఁ దల్లడిల్లి యుల్లంబులోని యారటంబు దీఱ నూఱడింపుచుండ. 2

క. పడమటిమల కలుగులలోఁ
నడఁగిన యిరులను గడంక నవలికిఁ దఱుమన్
వెడలెడి వడువున నడిచెను
బడమటికొండకును బ్రొద్దువడఁగెంపడరన్. 3

చ. అదనదితప్పి వేఁడివెలుఁగత్తమిలన్ దడమెత్తుపాముగా
ముదొరవినంపుమంటలనఁ బొల్పగుఁ బడ్మరసంజకావి, పైఁ
గుదిరిన సందెచీఁకటి తగుంబొగయట్లు, చెలంగు నల్లత్రాఁ
చుదడములట్ల చీఁకటులు, చుక్కలొగిం దలమానికంబులౌ. 4

గీ. గొండ్లిసలిపెడి యురవడి గుబ్బలల్లు
జడలగుంపులువీడి యీపుడమి నెల్ల
నలముకొనియె ననంగను నలుపుమిగిలి
కటికిచీఁకటి యెల్లెడఁ గ్రమ్ముకొనియె. 5

చ. అలరెడు రేవెలంది చెలువారఁగఁదాల్చిన కావిరంగుదు
వ్వలువవదల్చి చందురని వావిరిఁబొంౘఁగఁ గోరి మల్లెమొ
గ్గలుగల నీలిచీర మెయిఁ గట్టెననంగను జూడ కొప్పెఁ జు
క్కలగమితోడఁ జీఁకటులు కన్నులపండువుగాఁగ నయ్యెడన్. 6

ఉ. గొంగలు దూలుచున్వడలి గోడలు దూఁకుచుఁ బొంచిపొంచి బల్
సందడిగాకయుండఁ జిఱుసందుల వెంబడిఁ దావుఁ జేరుచున్
సందియమంద కాఱడికి సైఁచుచు సాముల మోసపుచ్చుచుం
జెందిరి కోరుకోరికలఁ జేరి బొజుంగులు దొంగలుందగన్. 7

సీ. తమ్ములకు దాయయౌ జేఁడు తాజగమ్ము
నందుఁ జొచ్చియుంటకుఁగాను ముందుపంపి
నట్టి తెలిగుడారమనంగ నమరెఁ దూర్పు
దెసను దెలివన్నె కలువలు తెల్వినొంద. 8

ఉ. చుక్కలతేఁడు చీఁకటులసూడు వెలుంగులతేని జోడు బల్
జక్కనపుల్గు మొత్తముల సారెకునేచెడువాఁడు చక్కనౌ
మిక్కిలి కంటిదేవరకు మేల్నగయై తగువాఁడు కల్వలన్
మక్కువఁ బ్రోచుతేఁడు మరుమామ కనంబడెఁ దూర్పుకొండపైన్. 9

చ. తఱియను వేటకాఁ డిరులదంౘను కోయిలగుంపుఁ బట్టఁగాఁ
బఱిచి వలన్నిగిడ్చె ననఁ బర్వెను దూర్పునఁ దెల్పు, కోఁజిగు
ళ్లైలుకయి పెట్టినట్టు నెలయింపగుఁ, బడ్డ పులుంగనంగళం
కొలుపగుఁ, గాంచి పర్విడెడు నోయనఁ గోయిల లేగుఁ జీఁకటుల్. 10

చ. కొమరు వెలుంగు రేవెలఁది కొప్పనఁ జీఁకటి, కొప్పుపూలునా
నమరును జిక్కచాల్, నెలయొయ్యారపు రాగిడిబిళ్ళయట్లగున్,
సమకొను కందు లోనిడిన నల్లని జాయన నొప్పు, రాగిడిన్
జమలిగఁ జుట్టుమల్లెలనఁ జందురుచుట్టును దెల్పుగన్పడెన్. 11

గీ. తమినిరేవెలంది యిడుగందంబు మేనఁ
దాఁజలువల ఱేఁడప్పుడు తాల్చెనఁగఁ
దెల్లనయ్యెను జందురుండల్లనల్ల
నెల్లకడలను వెన్నెల లల్లుకొనియె. 12

సీ. నెఱితావులుచెలంగ నిండారవిరిసిన
మల్లెపూవులతోడ వెల్లివిరిసి
కప్పురపుటనంటి విప్పఁబొరలరాలు
కప్రంపుఁబోడితోడఁ గలసిమెలసి
కమ్మవిల్తునిదాయ కాపురంబై తగు
వెలిమలజిగిత్రోడ వియ్యమంది
కలివేల్పునిల్లాలిఁ గసిమెంపుగాంచిన
పాలమున్నీటితో మేలమాడి
మెండుకొనియుండె బువినిండ వెండికొండ
కొండపిండులఁ జెండెడు దండిహత్తి
పిండికలకండ వెలిఁదమ్మి దండఁదెగడి
పండు రేయెండదండులు నిండుఁజిగిని. 13

వ. అత్తఱి నాబిత్తరి చెలికత్తెలతోడ నత్తోఁటలోనుండి నిండుకొన్న పండు
వెన్నెలతెగల సెగలకుం దాళంజాలక. 14

ఉ. చెందొవవిందు దండడినిఁ జిందఱవందఱ చెందికుందఁగాఁ
జిందురుచిందఁ, గొందలముచెందఁగ డెందము కందుఁడందపుం
గెందలిరుం దగందొడుగఁ, గ్రిందుపడందగు పొందికందొగల్
సందడిచిందఁ దుందుడుకు చందముఁబొంది వెలందివందురున్. 15

ఉ. నెయ్యపుటొజ్జ లోఁగఱపి నిచ్చలునాల్కఁ లుపంగ నోరె మొ
మ్మొయ్యన సన్నగించి మదినొంటిగనల్ల జగంబుచుట్టమున్

నెయ్యమునం దలంపుచును నిల్చినవన్నియు మూసఁగా నతం
డయ్యెడ మ్రోలఁగన్న డె నొయారియుఁ బ్రాలెను గన్నుమూయుచున్. 16

వ. ఇట్లాతండు తనకన్నుల మ్రోలసిలిచినట్లయిన మదికలంగి యచ్చెలువ యొక్క నెచ్చెలితో నిట్లనియె. 17

ఉ. వీఁడుగదమ్మ నావలపు వీజేఁడిచేసినవాఁడు, పొన్నపూ
వీడుగదమ్మ లోఁతయిన యాతనిపొక్కిలి కింకనావెతల్
వీడుఁగదమ్మ నన్నిపుడు వేయెదఁజేర్చిన నీతఁడున్నయా
వీడుగదమ్మ నేలఁగల వీడులలోపల మేటి బోటిరో. 18

వ. అని పచ్చవిల్తుని నెఱిచిచ్చునం గ్రాఁగుచు మఱియుం బలవింపం జొచ్చిన నెచ్చెలులు చలువపనులు సేయందలంచి. 19

సీ. చేడియయడుగులఁ జిగురాకులుంచిరి
యింతిచన్నులఁబూవుబంతులిడిరి
పొలఁతితొడల నంటిపొరలనంటించిరి
ముగుదపొక్కిటఁ బొన్నపూవులిడిరి
యువిదవాల్గన్నులఁ దొవరేకులద్దిరి
చానకెమ్మోవిఁ బూఁదేనె యిడిరి
తొయ్యలిచేదోయిఁ దూండ్లను బెనఁచిరి
కొమ్మకేల్గవ విరిదమ్ములిడిరి
యతివ యడుగులోనగు వానికవ్విసాటి
కావొ సరియౌనొయని చూచుకరణిఁజెలువ
చెలులు కావించిరొక్కటఁ జలువపనులు
వానివానిని బోలినవానిఁగూర్చి. 20

వ. అంత నొక్క ప్రోడచేడియ వారలంజూచి 21

సీ. మరుచిచ్చుదరికొని మండెడు నెమ్మేన
వీవనల్చేఁబూని విసరవలదు

